# తెలంగాణా వార్తలు

## ఆంధ్రోద్యమప్రచారము: స్థాయిసంఘ పక్షమున

### అర్సెపల్లి

ఈ గ్రామము నిజామాబాదు తాలూకాలో చేరినది. మైలున్నరదూరము గలదు. ఇచటిగృహ సంఖ్య ౧౫౦. జనసంఖ్య ౬౦౦ గలదు. పాఠశాలలేదు. గొల్లల, బోయల, సంఖ్య యెక్కువగలదు. ౨౦ ఋ నన్నారుకాపుఇండ్లు ౧ హరిజనులయిండ్లు, ౨ కోమటియిండ్లుగలవు.

### వెట్టిచాకిరి

ఇచటిహరిజనులకు ఇనాముభూమిలేదు. ఇటులే చాకలి బోయవారలకుగూడ లేదు. కాని వీరితో సర్కారిఉద్యోగస్థులు వెట్టిచేసుకొనుచున్నారు. వీరిమొర వినువారెవరును లేరని తెలియుచున్నది.

### రైతులు

వీరిస్థితి చాలశోచనీయముగా నేయున్నది. వీరిజీవితములు గ్రామములోగల శ్రీమంతులైన యిద్దరుకాపులు లింగయ్య, నర్సయ్య అనువారలపై యాధారపడియున్నవట. గ్రామము మొత్తమునకు ౨౦ వేల ఋణభారమున్నటుల తెలియుచున్నది. వీరిలో విద్యాగంధమేమాత్రము లేదు. ఉచితపాఠశాల ఏర్పాటుచేసిన తమపిల్లల చదివింపవలయునని యున్నటుల తెలిసినది.

### ప్రబోధము

ఎప్పటివలెనే ప్రబోధము కావింపబడినది. దాదాపు ౧౫ రోజులు ఈగ్రామములో ప్రచారముజరిగినది. రైతులస్థితిగతులు చక్కగాలేవనియును, ఒకరిద్దరు మంచిస్థితిలో యున్నను స్వార్థపరులగుటవలన గ్రామస్థితి బాగుపడుసూచనలు కనుపడలేదు. తుదకు ప్రతిగాపఠనమందిరముస్థాపించుటకైనా ప్రయత్నించవలసినదిగా గ్రామోద్యోగులైన శ్రీ వాగయ్య గంగయ్యగార్లను ప్రోత్సహించబడిరి. ఈ ౧౫ దినములకాలములో నిజామాబాదుయువకులలో కొంతమందికిని, రైతులలో కొంతమందికిని ఆంధ్రోద్యమతత్వమునుగురించి బోధించవయినది.

## అర్సెపల్లిలో ఆంధ్రపత్రికా పఠనాలయ స్థాపనము

ఈశ్వరనామసంవత్సర జ్యేష్టశు॥ ౫ రోజున కొందిరిప్రముఖులు సమావేశమై పైసంస్థనుస్థాపించ ఈక్రిందిప్రముఖులను సభ్యులుగా నెన్నుకొనిరి.

శ్రీయుత లింగయ్యగారు,
,, నర్సయ్యగారు,
,, వాగయ్యగారు,
,, గంగయ్యగారు,
,, నారసింహారెడ్డిగారు,
,, యల్లప్పగారు,

ఈసభ్యులు పఠనాలయమునకు వచ్చుపత్రికలను చదువుటకునిర్వాహకుడిని ఏర్పాటుచేసిరి. ప్రస్తుతము తెలుగుపత్రికయగు "గోలకొండ"పత్రికను తెప్పించుటకు తీర్మానించుకొనినారు. కొంతకాలముజరిగినత్వాత వీలునుచూచుకొని "ఆంధ్రపత్రిక" వంటి దినపత్రికనుగూడా తెప్పించుకొనుటకు నిశ్చయించుకొనినారు.

ఇట్లు
ప్రచారకుడు

## ఆలంపూరు తాలూకా వార్తలు

[స్వ.వి.]

### నీటివసతులు

ఈతాలూకా కృష్ణా, తుంగభద్రానదులమధ్యనుండినను ౭౦ గ్రామములపరిమితి మాత్రమేయుండినను భూస్వభావమునుబట్టి నీటివసతులు చాలతక్కువ. నదీతీరములవారు నదులనుండి లాభముపొందుచున్నారు. పెద్దపెద్దవాగులలో పదానీయగారుచోట్ల నాలుగైదుగ్రామములవారు లాభముపొందుచున్నారు: కాని ఈరెండుసౌకర్యములులేని గ్రామములు సుమారు ౧౦ వరకు నీటియిబ్బందిచే కష్టపడుచున్నవి. మూడునాలుగు గ్రామములు ముఖ్యముగా పేర్కొనదగినవి.

౧. ఇటికేలపాడుగ్రామము. ఈగ్రామమునకు "నీళ్లులేని ఇటికేలపాడు"అను ఉపనామము ఈప్రాంతములలో చాలప్రసిద్ధి. ఈగ్రామములో అరమైలుదూరమున ౧౨౦ మెట్లుగల ఒక ఉప్పునీటిబావికలదు. అనగా ఈగ్రామములో ఎవ్వరి "పప్పులుఉడుకదు".

అందుకొరకై గ్రామస్థులు ఊరిముందర మురికినీటిని ఒకపెద్దగుంటలో చేర్చి దానిలోనిన వానసీటిని కొన్నిమాసాలు వాడుకొందురు. ఈనీరు సర్వరోగములకుమూలము. పైగా ఈగ్రామములో శీతజ్వరములు, వారిపురుగులు, అపారము. ఈవిషయములో గ్రామస్తులు ఎన్నియోమారులు జిల్లాకును, తహశీలుకున్ను, డాక్టరుకున్ను, బావులత్రవ్వ కాళవాటికిన్ని మొరపెట్టుకున్నారు. ఏమియు ఫలితముకాలేదు.

౨. కోనేరుగ్రామము. "కోనేరు" అనగా నీటిగుంట. ఈగ్రామములో ఉటుబావికేనేలేదు. గ్రామముబజారులలోని మురికినీరంతయు ఊరిముందట ఒకగుంతలో నింపుకొందురు. ఈనీరు ౧౨ మాసాలు రైతుల ఉపయోగించుచునట్టిది. ఈనీటికి ఒకచెంబెడు తీసికొని డాక్టరు పరీక్ష చేయించిన ఒకడిన్నర తులము ఎర్రమన్ను, పదిలక్షల సూక్ష్మక్రిములు, ఒకతులముసంసం, ఇత్యాదిద్రవ్యములు కనిపెట్టబడవచ్చును. మొదటిగ్రామము వలెనైనా మొరపెట్టుకొనుటకు నోరులేనికైతులీ గ్రామమువారు.

3. జిల్లాపురము.

ఈగ్రామము చుట్టూనాలుగామడవరకు ప్రఖ్యాతిపొందిన గ్రామరాజము. యమాయిముల కీగ్రామము విహారరంగస్థలము. ఆయినను త్రాగుటకు నీరేగతిలేనివారికదా! ఊరుసందటనే ఒకపెద్ద "ఉక్కంగుంత" కలదు. మరియు ఒకపెద్ద "కోధనాలభావి" నాలుగుదిక్కుల గొప్పవాలిపిన రాతికట్టడములచే విలసిల్లుచున్నది. కాని లోపల మంచమువేసినాయిగా నిద్రపోవచ్చును. కాని మంచముక్రింద ఇంటినుండితీసికొనిపోయిన నీళ్లుత్రాగుటకై ఉంచుకొనవలెను, ఒకమైలుదూరములో వాగుగట్టున కొన్నియేండ్లక్రిందట ఒకబావిత్రవ్వినారు. అదియే యీగ్రామమున కాధారము.

టాస్కుడుదొరవారు కొన్నియేండ్లక్రిందట రాయచూరుపరిస్థితులను గమనించి నీటివసతికై ఒకప్రత్యేక అధికారిని ఒకకచ్చేరినిస్థాపించిరి. కానివీరు తక్కువ తాలూకాలోపనిచేసినను యీతాలూకాకు దయచేయకపోయిరి.

అనేకగ్రామాలలో ఒకబావియెట్లున్నతవ్వినలాభములేదు. ప్రతిగ్రామమునకు రెండుమూడుబావులకుపైగా ఉండవలెను. హరిజనులకు ప్రత్యేకసౌకర్యము లుండవలెను– పైజెప్పినమూడుగ్రామాలలో హరిజనులకు చాలాఇబ్బందికలదు. ఇప్పటి రాయచూరు తాలూక్దారుగారు చాల మంచివారని వినుచున్నాము– వారిదృష్టి ఈవిషయమున ప్రసరించునవియు, వారికాలములోనే యీతాలూకాలోని యీయిబ్బంది తొలగిపోవునని తలచుచున్నాను–

## శ్రీవిశ్వేశ్వరాంధ్ర భాషానిలయము

(హుజూరాబాద)

జ్యేష్టశు॥ ౧౩ ఇందువారం:—

ఈ భాషానిలయమునకు కొన్నిసందర్భముల వలన ఇంతవరకు క్రొత్తఎన్నికలు జరుగక ఈ జ్యేష్టశు॥ ౧౩ నాడు మహాజనసభ సుమారు ౨౫ జనముతో సమావేశమయి సభికులఅభిప్రాయానుసారము శ్రీ గోపాలకృష్ణయ్యగారు సభాధ్యక్షతకు ఒప్పుకొని పీఠమలంకరించిరి తరువాత గ్రంథాలయోద్యోగులు సభికులఎన్నికలు ఈక్రిందివిధముగా జరిగినవి.

### ఉద్యోగులు

మ.రా.శ్రీ వెంకట్రాజం పేష్కారు అధ్యక్షులు,
,, వెంకట మధుసూదనరావు కార్యదర్శి,
,, దామెర వరహాలగారు భాండాగారాధిపతి,
,, గంగిశెట్టి శ్రీశైలముగారు కోశాధిపతి,

### సభికులు

,, రాజేశ్వరరావుగారు [తామీరాత్]
,, నారాయణరావుగారు [వగిదీవలీసు]
,, సీతారాంరావుగారు
,, వెంకట్రాజంగారు [తామీరాత్]
,, సూర్యదాసుగారు వకీలు.

పైవిధముగా నూతనఎన్నికలు జరిగినతరువాత [౧] ఆంధ్రవారపత్రిక, [౨] ఆంధ్రఉగాది సంచిక, (3) మైమేసింగు (ఇంగ్లీషుపత్రిక) తెప్పించవలెనని సభికులు చందాదారులు తీర్మానించినపిమ్మట సభజయప్రదముగా రాత్రి సుమారు ౯ గంటలకుముగిసెను–


డోంగ్రే గారి
బాలామృతము
బలహీనమైన
బిడ్డలకు
పుష్టియును
బలమును
ఆరోగ్యము
నిచ్చును.



## జాగ్రత్తగల ప్రయాణికుడు బాధ్యతనువహింపడు

ప్రయాణముచేయునప్పుడు రొక్కమును వెంటనుంచుకొనుట బాధాకరమును అపాయకరమును నైయున్నది. నిర్విచారముగా ప్రయాణము చేయదలచిన యెడల

సెంట్రల్ యొక్క
ట్రావెలర్సు చెక్కులను ఉపయోగింపుడు

అవి:—

1. నష్టములుగకుండ కాపాడును.
2. రొక్కమునకంటె సులభముగా తీసికొనిపోవచ్చును.
3. 25,50 100 రూపాయిలు మొత్తములలో దొరకును.
4. హెడ్డాఫీసులోను ముఖ్యమైన బ్రాంచిలలోను దొరకును. ఏబ్రాంచిలోనైనను పేఫీసులోనైనను నగదు యివ్వబడును.



# ఆర్. గోపాల్

జనరల్ క్యాప్ మర్చంటు

వులెన్ సూటర్స్, వులెన్ అండ్ కాటన్ సాక్స్, గ్లౌజెస్ మొదలైన అన్ని రకములు కాటన్ అండ్ సిల్కులో, (ఫాక్స్) అన్నిరకములు, సిల్కు అండ్ కాటన్ దస్తీలు, ఫర్ ఫోల్డింగ్, చెస్టర్ ఫోల్డింగ్, సాలార్ జంగ్ షేప్, కాశ్మీర్ వులెన్ మొదలైన అన్నిరకముల టోపీలు సిద్ధముగా దొరకును.

ముఖ్యముగా గమనింపుము:—ఆర్డరుపై కోరినప్రకారం టోపీలనుయిరువదినాలుగుగంటలలో తయారుచేసి యివ్వగలము.

ఆర్. గోపాల్
జనరల్ క్యాప్ మర్చంటు
బస్టాండ్ కోటీ, సుల్తాన్ బజార్, హైద్రాబాద్ (దక్షిణ





ప్రసిద్ధ లోకామయహర
కస్తూరి మాత్రలు
జలుబు, జ్వరము, దగ్గువ్యాధులకు చాల ఉపయోగము.
సీసాఒకి రు ౦–౪–౦.
శ్రీసీతారాఘవ ఔషధాలయం
మైసూరు
ఏజంట్లు:–చగనలాలు నారాయణజీ అత్తరు వ్యాపారులు
హైద్రాబాదు దక్కన్

అభిదస్తగు వికాలతు జి. అమృతరెడ్డి వకీల్ సూర్యాపేట

(నం 40 రు)

మర్కూం చ19అమర్దాదు } జనాం మల్లారపు చెన్నయ్య వ॥ రాయన్న కులం
1346 ఫసలి. } కమ్మవారు...సా॥ అనాచిపురం తా॥సూర్యాపేట.

జి. అమృతరెడ్డి వకీలు సూర్యాపేట దఫ్తరంనుంచి మల్లారపు దాసయ్య. శౌరయ్య వ॥ రాయన్న సా॥ అనాచిరపుం, భీమవరం తరఫున జారీచేయబడిన నోటీసు వివరములు:—

సదరు దాసయ్య, శౌరయ్య మరియు తోమాసయ్య, నీవు నలుగురు స్వయంసోదరులు, ఏకోదరులు. మీరందరు ఇంతవరకు అవిభక్తముగనుండి స్థిరాస్తి ఇందుకు ప్రక్కనున్నపట్టిక ప్రకారము అవిభక్తముగనుండుటచే సమిష్టిగ స్వాధీనానుభవములోనున్నది. కుటుంబముకూడ అవిభక్తస్థితిలోనున్నందున నీవు కుటుంబపుమెనేజరుగను, కర్తగనుకుటుంబవ్యవహారములు, వ్యవసాయపుపనులు నిర్వహించుచుంటివి. గొప్పఆస్తియు, విస్తీర్ణమయిన వ్యవసాయము కావున ప్రతివత్సరము రాబడికూడ అధికముగనున్నది. ఇట్టి ఆదాయవ్యయముల బాధ్యత నీయందేయుండెను. నేటికి 15-20 వత్సరములనుండికూడ ఇట్లేజరుగుచున్నది.

నీవిపుడు దుర్భావముచేత కుటుంబాదాయమునంతయు స్వయముగ అపహరించి పైఇతరమెంబర్లకు నష్టముకలిగించు యుద్దేశముతోనున్నావు. నేటివరకు కలిగిన ఆదాయపులెక్కలను చూపుటకు నిరాకరించి నీవేహరింప జూచుచున్నావు. 1346 ఫసలి వ్యవసాయపు రాబడిమాత్రమే పదివేలకు మించియున్నది. ఐనప్పటికి నావద్ద డబ్బులేదనిచెప్పుచునీదురభిప్రాయమును వెల్లడించుచున్నావు.

నీవిప్పుడు సమిష్టిలోగల స్థిరాస్తిని ఇతరులకు విక్రయించిగాని, అన్యాక్రాంతము చేసిగాని, తాకట్టుపెట్టిగాని మాకు నష్టంకలిగించు నుద్దేశముతోనున్నట్లు మాకు రూఢిగ తెలియుచున్నది. కాని అట్లుచేయుటకు నీకేమాత్రము అధికారములేదు. కొంత స్థిరాస్తి హక్కులేని ఇతరులకు అర్హులను నెపముమీద సంక్రమింప చూచుచున్నట్లుకూడా మాకు తెలిసినది.

పైనవ్రాయబడిన కారణమువలన నీఅధికారము, మేనేజుమెంట్‌కు నష్టకారణమున నున్నందుననే ఇంతకుముందే అట్టినీఅధికారములను తీసివేయబడినవి. మరియు విభాగపు ఉద్దేశ్యము ప్రకటింపబడినది. సమిష్టిగనున్న చరాస్థియు స్థిరాస్తియు, సూర్యాపేట భీమవరము, అనాచిపురములోగల ఇండ్లువగైరాలపై దానవిక్రయాదికార్యములకు నీకేమి అధికారములేదు. అదిగాక నీకొకవారము దినముల గడవొసంగబడుచున్నది. ఈవ్యవధిలో యావదాస్తిని స్వయముగగాని పెద్దమనుష్యులవలనగాని, సమానభాగములుగ మనము పంపిణి చేసుకొనవలెను. మేనేజుమెంట్‌వల్ల నీవద్దగల నగదుడబ్బు, వగైరాల లెక్కచూపి నిల్వడబ్బుపంపకముచేసి ఇవ్వవలెను. ఇందుకు వ్యతిరేకముగ జరిపినయెడల సమిష్టిభూములను వారే స్వయముగ సేద్యముచేయగలరు. వ్యవసాయపు అదనుకావున నష్టముకాకుండా ఇతరులకు కౌళ్ళుకూడా ఇవ్వబడును. విభాగపు దావాకూడా చేయబడును ఆస్తినిఅన్యాయముగ నష్టపెట్టినను, స్వానుభవమునకు తెచ్చుకొన్నను, నీవే బాధ్యుడవగుదువు. విక్రయాదులు చెల్లనేరవు. తోమాసయ్య అనుమెంబరు కూడా నీతో ఏకీభవిం క్షుటగానుండుటచే పైవారికి నష్టముకలుగువికార్యము కూడా ఆయన చేసినయెడల అదివారికి సంబంధించనేరదు.

ఇందులో ఒకప్రతి మా సమ్మి తోమాసయ్యకు విషయం తెలియుటకై పంపించడమైనది.

మరియు దీని మరియొక్కయొక్కప్రతి రహబరుదక్కను ఉర్దూ దినపత్రికకును పంపడమైనది. ఏలననగా సమస్తజనులకు మల్లారపు చెన్నయ్యయొక్క మేనేజుమెంటు హైసియ్యతు రద్దుగాఎంచుకొనుటకును, ఆతడుచేసిన ఏదొకవిషయమైన అన్యాక్రాంతము, ఇచ్చిపుచ్చుకొనుటయు చెల్లనేరదు. కాబట్టి తెలియపరచడమైనది.

ఈనోటీసులో ఎచ్చటైన చిత్తులుకాని కొట్లుగానిలేవు. విడివిడిగావ్రాసి పంపనైనది. సమయానుసారము అదాలతులో పేషుకావలసియుండుచు.

భూముల ప్రేహరిస్తు

| ఖాతా | గ్రామము పేరు | సర్వే నంబరు | | ఎకరు | శిస్తు |
|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ |
| | అనాజపూ | 169 | | 17-32 | 25 |
| 13 | ఠతా॥సూ | 158 | | 7-1 | 6-8-0 |
| | ర్యాపేట | 168 | | 19-10 | 27-0-0 |
| | | 167 | | 7-18 | 10-0-0 |
| | | 166 | | 16-28 | 23-0-0 |
| | | 184 | | 9-28 | 12-0-0 |
| | | 182 | | 7-38 | 9-8-0 |
| | | 186 | | 8-39 | 10-0-0 |
| | | 199 | | 9-10 | 7-0-0 |
| | | 143 | | 18-20 | 24-0 0 |
| | | 149 | | 17-35 | 25-0-0 |
| | | 174 | | 11- 2 | 16-0-0 |
| | | 173 | | 17-22 | 25-0-0 |
| | | 191 | | 14-33 | 12-0-0 |
| | | 170 | | 18-31 | 26-0-0 |
| | | 175 | | 9-22 | 13-0-0 |
| | | 181 | | 9-32 | 12-0-0 |
| | | 197 | | 4-15 | 4-0-0 |
| | | 183 | | 21- 0 | 23-0-0 |
| | | 171 | | 13-20 | 19-0-0 |
| | | 172 | | 20-20 | 30-0-0 |
| | | 196 | | 13-16 | 9-8-0 |
| | | 185 | | 12-20 | 13-0-0 |
| | | 176 | | 11- 6 | 15-0-0 |
| | | | | 318-18 | 403-8-0 |
| 65 | ఆయిజన్ | 218 | | 5-16 | 8-8-0 |

యిట్టిఇమీన్ ఖబ్జా బదాఖలే రిజస్టరు

53 ఆయిజన్ జంకోర్వర2-12　3-0-0

రావుపట్టామింజు మెరేమాకజీరా

యిట్టిఇమీన్ ఖబ్జా అదాఖలే తైజా మాఖబ్జా

ఆనాజిపురంతా॥సూర్యాపేట3-20　2-8-0

మ॥దోసపహాడు38 నిస్సు　6-2　66-0-0

246 ఇట్టిఇమీన్ పేర
248 వాండ్ల పట్టావుండి
249 మన ఖబ్జాలో వు
250 న్నది.
251
260
261 మ॥దోసపహాడ్కు శివారులోకర్నాటి అంతయ్య పేరపట్టావుండి మన హక్కుభుక్తంలో వుంచుకున్నుజమాన్ య23-9 బరేహజా పైసలాలో పంచాయతుఖబ్జ

మ॥ భీమవరం 269　12-1
తా॥సల్ గ్రాం 267　16-5
దలో పట్టా 281　14-38
భూమి 282　15-35
58-29　68-0-0

ఆయిజన్గ్రా 183　6-25
మములో
తప్పుండిబుభీమ్ 184　0-33　6-8-0
మయ్య పేర ప　7-18　23-13-0
ట్టాభూమి మిం జామతే

ఆయిజన్ గ్రామ 244 244
ములోచన్నయ్య
బాగతు చన్న
య్యబాగయ్యతిరి
ఆయిజన్ గ్రామ 247 యిట్టిఇమీన్ ఖబ్జా
ములోకడెపుసో　వుండివున్నది
మనితా॥ పరా 242 ఇట్టిభూమి బాగయ్య
ఆయిజన్　చన్నయ్య మునరవుచి
న్నయ్యవగైరాకబుజా
361మింత 4-0 పెమ్మాది
కోటిగానిపతా మన కబుజా
అమ్మగల్లు తా॥ మిర్యాలగూడెం
పెదిర పురుషోత్తరెడ్డిపేర పట్టావుండి సమిష్టికి నాలవభాగముజమీన్ ఖుష్కి ఖబుజా వుంది వున్నది.

అమృతరెడ్డి వకీలు


# 3 గడియారములు, ౧౫౦ వస్తువులు రూ ౧౪ మాత్రమే



మా సువాసనగల ఆటోస్లోరీనా అరు సీసాలను రూ ౧౪ లకు కొనువారికి ఈక్రింద చెప్పబడినవస్తువులు ఎట్టిఖర్చులుగానిలేక ఉచితముగాదొరకును:— ఒక చిన్నసైజు అందమైన డిమ్మీచేతిగడియారము, 300 అడుగుల దూరము వెలుతురుపారించు టార్చిలైటు ఒకటి ౧౨ క్యారెట్లు బంగారుగిల్టుపాళీగల ఫౌంటెన్‌పేనా ఒకటి, ఒక నికెల్‌కేసు షమ్మీ "ఐ" బైండీను క్లాసు, ఒక జిలెట్ సేఫ్టీరేజరు, ఒక క్షౌరపుపట్టు, ఒక క్షౌరపుబ్రష్షు, ౪ బంగారుగిల్టుగుండీలు; ఒక ఇమిటేషన్ ముత్యాల కంఠహారము, మరియు ౧౩౦ ఇతర చిత్రవస్తువులు లేక ౫ ఏండ్ల గ్యారంటీగల్గి చిన్నసైజుదగు ౩౬ గంటల టైంకీపర్ లీవర్ ప్యాకెటువాచి టపాఖర్చులు ప్యాకింగు ౧౨ అణాలు.

జాబులు ఇంగ్లీసులో ఈక్రిందిఅడ్రసుకు వ్రాయవలెను:—

ఇండియన్ స్టేషనరీస్టోర్

[డిపార్టుమెంటు నెం. ౧ యం,] పోస్టుబాక్సు ౧౧౭౧౩, కలకత్తా


# చక్కెరపన్ను విచారణ సంఘము

విదేశములనుండి భారతదేశమునకు దిగుమతియగుచక్కెరపై సుంకము వసూలు చేయుటకు హద్దుపెట్టిన కాలపరిమితి దాటబోవుచున్నది. ఆదిదాటులోపల దేశీయులసుంకముఉండు కాల వ్యవధిని హెచ్చించుటకై దేశీయులు చేసిన అంకోరనపై, ఇండియాప్రభుత్వమువారు ఇంకఎంతకాలము సుంకము నుంచదగును, ముందుకు ఎంతలెక్కన సుంకమువసూలు ఏర్పాటు ఉండవలెను అనువిషయము అనువిచారించుటకై టారిఫుబోర్డును నియోగించినారు. ఆబోర్డువారు దేశవిదేశములనుండి ఉపకమండలములనుండి విచారణలు చేయుచుండిరి. ఆ సమయములో మ.ఘ.వ. నిజాంప్రభుత్వముయొక్క ఆదాయశాఖమంత్రియగు టాస్కు దొరవారు ఉపకమండలమునందేయుండి, నిజాంరాష్ట్రపు ఎగుమతిగుమతులవిషయమై కొన్నిప్రశ్నలను హైదరాబాదుకు వ్రాసి తెలిసికొనిరి, వారు టారిఫుబోర్డువారినికలిసికొని మాట్లాడికూడ ఉండవచ్చును, ఇపుడుటారిఫుబోర్డువారు చెఱకుపండించువారినెక్కువమందిని చూడగోరుచున్నారు. వారు పడిరోజులుపూనాలోనుండి, అటనుండి బొంబాయికిపోయెదరు. అక్కడినుండి ఆగస్టుమొదటివారములోబయలుదేరి హైదరాబాదు, కర్నూలు, బొగువాలా మున్నగుప్రదేశములను చూచి, అక్కడిఅభిప్రాయములను కనుగొని సెప్టంబరునెలమధ్యకు కలకత్తా చేరుదురని తెలియుచున్నది. టారిఫుబోర్డువారు చెఱకుపండించు రైతుల అభిప్రాయములను గ్రహించుటకై ఎక్కువతొందరపడుచుండ "ఇండియన్ సుగరుమిల్సు" (భారతదేశపు చక్కెర కార్ఖానాల సంఘము) వారు తమ ప్రతినిధుల అభిప్రాయము లకనుగొనుటకు ఎక్కువ అవకాశములను కోరుచున్నారు.

# తుంగభద్ర ప్రాజెక్టు ఆలోచనలు

మదరాసు ప్రభుత్వపు యింజనీరులు బాలైమధ్యలో హైదరాబాదుకుపోయి మ.ఘ.వ. నిజాంప్రభుత్వపు యింజనీరులతో కలిసికొని తుంగభద్రాప్రాజెక్టుని పంచుకొనుటనుగూర్చి ఆలోచించుదురని తెలియుచున్నది, ఇపుడు పరిష్కారము జరిగినచో, మధ్యవర్తిద్వారా పరిష్కారము చేసికొనవలసినఅవసరము తప్పును.

భారత బ్రిటిషు దేశములకు వర్తకపు టొడంబడిక

సిమ్లా; జూన్ ౨౬:-

ఇండియా బ్రిటనులమధ్య వర్తకపుటొడంబడికను కుదుర్చుటకు సంప్రదింపులు జరుగుచున్నవనియు. యిప్పటివరకు బ్రిటిషుప్రతినిధులునూ భారతీయప్రతినిధులును మూడుమారులు సమావేశమైయుండిరనియు తొలికార్యములనునిర్వహించుటలో చాలఅభివృద్ధి జూపబడెననియు తెలిసినది.

# కావలెను

అత్రాపుబల్దా బాగాయతీజిల్లా ఆంధ్రజనసంఘమునకు ఒక అనుభవశాలియగు ప్రచారకుడు కావలసియున్నది. ఆమోదించువారు వేతనము మొదలగు వివరములు తెలియుటకై సుల్తానుబజారు, హనుమానుటేకిడి, హైద్రాబాదు, డి. రామారెడ్డి (వకీలు), సంఘకార్యదర్శిగారితో కలియగలరు.




# గోలకొండ పత్రిక

ఈశ్వరనామ సం॥ర జ్యేష్ఠ బ౹౧౨

సోమవారము


## అక్బరలీఖాన్ గారి అభిమానము

మీర్ అక్బరలీఖాను బ్యారిష్టరు గారు మొన్ననే ఇంగ్లాండు నుండి వచ్చియున్నారు. వారు యూరోపు పరిస్థితులనుగురించియు, హిందూస్థాని రాజకీయ పరిస్థితులనుగురించియు తమ అభిప్రాయములను వెల్లడించియున్నారు. ఇప్పుడు మనకావిషయములతో అవసరము లేదు. మన హైదరాబాదు రాష్ట్రమునుగురించి యిచ్చిన అభిప్రాయములే మనకు ప్రధానమైనవి. వారిట్లు సెలవిచ్చినారు:—

"లండనులో నేను పార్లమెంటుసభ్యులతోను, బ్రిటిషుఇండియా నాయకులతోను, భారతసంస్థానముల మంత్రులతోను మాట్లాడియుంటిని. దానివలన నేను గ్రహించగలిగిన దేమనగా హైదరాబాదుసంస్థానము తనకు ఒకప్పుడుండిన,ముఖ్యమైనటువంటి సంధిహక్కులను తిరిగిపొందుటకు తగిన సమయమిదియే. ఈసమయమును జారవిడుచుకొంటిమా, మనకింకొకటివచ్చుటకు సమ్మకము లేదు. ప్రజాసేవానక్తులగు హైదరాబాదీయులందరును అసంఖ్యపత్రములను, భారతరాజ్యాంగశాసనమును, ఫెడరేషనును సంబంధించిన విషయములను సరిగానరుసనతెలిసికొనుచు ప్రభుత్వమువారు వాగ్దానముచేసినట్టి పనుల నివేదికను ప్రకటించినవెంటనే, వారు రౌండుటేబిల్ సభ కొకదానిని జరుపుటకు ప్రార్థించుచున్నాను.

మనమందరము ఒక తెగ చేరి ఆలోచించుటకు అవకాశము పొందుటకు విశ్వప్రయత్నము చేయవలెను. మరియు ఒక తెగవారు ఇంకొక తెగవారిహక్కులను భంగపరచునట్టి శాసనసభను విస్తరించవలెను. మరియు మనము ప్రభుత్వమువారిని ఈరాష్ట్రముయొక్క ఆర్థికస్థితిని పరిశీలించి పటువైన పరిశ్రమల కొరకు కమిటీని అవలంబించుటకై కోరవలెను. మనజాగీర్దారులు తాము తమపరిపాలనలో నుండు ప్రజలకొరకు మేలు చేయుటకై ఆసక్తి కనపరచవలెనని గ్రహించునట్లు చేయవలెను.

తుదకు నేను,మనము చాల కష్టకాలము లో నున్నామనియు ఇప్పుడు ప్రతి తెగవారును తమతమ బాధ్యతలనుగ్రహించి సర్వుల క్షేమముకై పాటుపడవలెననియు చెప్పుచున్నాను."

ఈ అభిప్రాయములను బట్టి అయిదు ముఖ్యవిషయములు గమనించదగినవగుచున్నవి.

(౧) హైదరాబాదు సర్కారువారును బ్రిటీషువారికిన్ని పూర్వము జరిగిన ఒడంబడికలను పూర్తిగా అమలు చేయించుట;

(౨) స్థానిక రౌండుటేబిల్ సభను సమావేశపరచుట;

(౩) రాష్ట్రశాసనసభను విస్తృతమొనరించుట;

(౪) ఆర్థికవిచారణ గావించి రాష్ట్రమందు పరిశ్రమాభివృద్ధి గావించుట;

(౫) జాగీర్దారుల దృక్పథమందుమార్పు గావించుట.

ఈవిషయములన్నియు చాల సమంజసమైనవని అందరును ఒప్పుకొనవలసినదే. ఏవ్యక్తికిగాని సంఘమునకు గాని అభిప్రాయభేద ముండదని మా విశ్వాసము.

నిజాం సర్కారువారితో జరిగిన సంధులు, ఒడంబడికలు చాల గలవు. అవన్నియు ముద్రించినారో లేదో తెలియదు. కాని పలుమారు విమర్శనలు పత్రికలందు జరుగుటనుబట్టి విశదమగుచున్నదేమనగా, క్రీ.శ. ౧౭౫౦ సంవత్సరమునుండి బ్రిటిషు ప్రభుత్వమునకును నిజాం సర్కారునకును ఒడంబడికలు జరిగినవి. వానిలో కొన్నిమారులు నిజాము సర్కారునకు నష్టమగువిధముగా ఒడంబడికలు పరిణమించినవి. నిజాం సర్కారువారి ఇప్పటి రాజ్యపరిమితి ౮౦ వేల చదరపు మైళ్లకు పైగానున్నది. కాని ౧౭౦౦ క్రీ.శ. నాడు మనప్రభుత్వరాజ్యపరిమితి ఇంతకు రెండింతలుండెను. కాని క్రమక్రమముగా సుమారు ౧లక్ష చదరపుమైళ్ల వైశాల్యముగల రాజ్యము బ్రిటిషు ప్రభుత్వ వశమయ్యె. ఉత్తరసర్కారులు, గుంటూరు సర్కారు, రాయలసీమ అనబడు దత్త మండలములు, బీరారు రాష్ట్రము, మచిలీ బందరు మున్నగు ప్రాంతములన్నియు విడిపోయెను.

మరియు నిజాము సర్కారువారు బ్రిటిషు వారికిచేసిన సేవ జగద్విదితము. అందుచేతనే మనప్రభువులను "విశ్వాసపాత్రుడగుమిత్రుడు "Faithful Ally" అను బిరుదముతో ఇంగ్లీషువారు గౌరవించుచు వచ్చినారు. ఈబిరుదము హిందూస్థానములో మరియే నవాబులకును యేమహారాజులకును లేదు.

ఇంతేకాక ౧౮౫౭వ సం॥ పు విప్లవములో మన సర్కారుచేసిన సహాయమును బ్రిటిషు వారెన్నటికిని మరువజాలరు. ఆకాలమందలి బొంబాయి గవర్నరు ఇట్లనెను.

"If Nizam is lost, all is lost"(నిజాము కోల్పోయెనా అంతయు ప్రళయమే) అని వాపోయెను. నిజాం తిరుగుబాటు చేయలేదు. పైగా తిరుగుబాటును పట్టుదలతో నణచివైచెను. వింధ్యాద్రికి దక్షిణభాగమంతయు సురక్షితమయ్యెను. మొన్నటి జర్మనియుద్ధమునందుచేసిన సహాయమును, తుదకు యుద్ధము ముగియునప్పుడు ఇచ్చిన కోట్లద్రవ్యము మరువరాని విషయములు.

రాష్ట్ర ప్రజలందరునుప్రజాభిమానము, పవిత్రమనసుకుచేయును ప్రభుభక్తి పరాయణులనుటలో అవంతయు సందేహము లేదు. అంతేకాని రాష్ట్రాభిమానము కలవారు. రాష్ట్ర గౌరవము, ప్రఖ్యాతి అభివృద్ధి, సర్వదా సర్వజనులు కోరుచుండువారు. కావున మొదటి సమస్య విషయములో అక్బరలీఖానుగారితో మేము సంపూర్ణముగా నేకీభవించుచున్నాము.

(౨) రౌండుటేబిల్ సభను స్థానికముగా నేర్పాటుచేయుటమంచిదే. ఇదివరలో ప్రభుత్వమువారును ప్రజల అభిప్రాయములను కనుగొనుచునేయున్నారు. సర్ హైదరీగారు విశాల హృదయులు. కలకత్తాకు పోవుచున్నప్పుడు కూడ కొందరుప్రముఖులతో తమ అభిప్రాయములను వెల్లడించి యుండిరి. రాష్ట్రముయొక్క ముఖ్యసమస్య విషయములలో ప్రభుత్వమువారు ప్రజలతో ఆలోచించువిషయమున విముఖులు కారని మాఅనుభవము. కాని ఒక్క విషయము మాత్రము హెచ్చరించవలసినదికలదు. ఏమన ప్రభుత్వమువారు ప్రజల అభిప్రాయమును కనుగొనునప్పుడు మొకంజీకమిటీ సందర్భములో చేసినట్లుగా ముఖ్యముగు ప్రజాహిత సంస్థల ప్రతినిధులను పిలుచుట మంచిది.

(౩) రాష్ట్రశాసనసభను విశాలముగా చేయుటయు మంచివిషయము. ఈ విషయమున కాశీనాథరావు వైద్యా గారి చిత్తు శాసనమును అవసరముగు మార్పులతో నందరును ఆమోదించుట ప్రధానకార్యమై యుండును.

(౪) రాష్ట్రముయొక్క ఆర్థికవిచారణ ఇదివరకే నీరిగినది. కేశవఅయ్యంగారిద్వారా నొకటి చేయించబడినది. ఆ సూచనల ప్రకారము భగేలాశాసనము, రైతుల ఋణవిమోచన శాసనము వంటి శాసనములుకూడ కావింపబడినవి. మరియు అప్పుల పరిష్కార సంఘము కూడ ఏర్పడినది. కాని పారిశ్రామిక విషయములో ప్రభుత్వమువారికను ఎక్కువశ్రద్ధ వహించవలసి యుండును. మన రాష్ట్రములో మంచి నబ్బులు తయారగుచున్నవి. మ. ఘ. వ. మన ప్రభువుగారే తమ దేవిడీలో గోలకొండ సబ్బును వాడుచు అందరును దానిని వాడవలసినదని సెలవిచ్చిరికదా! ఎందరు వాడుచున్నారు. మన సర్కారీ వైద్యాలయములో ఎంతవరకిది వాడబడుచున్నదో తెలియదు.

(౫) జాగీర్దారుల సమస్య ప్రత్యేక సమస్య. అది వేరుగా చర్చింపదగినది. మన రాష్ట్రములో జాగీర్లప్రజలు చాల కష్టము లనుభవించుచున్నారని ప్రభుత్వమువారికికూడా బాగుగా తెలియును. జాగీర్లప్రజలకు వైద్యానుకూలములు గాని, విద్యా సహాయముగాని, న్యాయ సౌకర్యములు గాని, పన్నుల పరిమితి గాని, చాలచోట్ల లేకుండుట అత్యంత విషాదకరమగునంశము.

అక్బరలీఖానుగారు చెప్పినట్లు మన మీ సమయమునందే అన్నియు చక్కబెట్టుకొనవలెను. ప్రజలును ప్రభుత్వమును ఏకాభిప్రాయముతో రాష్ట్రాభివృద్ధికి తోడ్పడుదురని ఆశించుచున్నాము.

---

### ఉస్మానియా విద్యాపీఠవిద్యార్థులిరువురు పోలీసులచే నిర్బంధించబడుట

ఉస్మానియావిద్యాపీఠ కళాశాల విద్యార్థిద్వయము గతశనివారము గాక అంతకుపూర్వము శనివారమునాడు సికింద్రాబాదునుండి మలక్పేటకుపోవుచు మలక్పేటస్టేషనుమాస్టరుతో పోట్లాడుటతటస్థించెను. గేటువద్ద టిక్కెట్టుకలెక్టరులేనట్లును, ఆవిద్యార్థులు వెడలిపోవుచున్నట్లును, అప్పుడు స్టేషనుమాస్టరుపట్టుకొని వారలను పోలీసుకానిస్టేబిలు వెంట కాచిగూడస్టేషనుకుపంపినట్లును, ఆసందర్భములో దెబ్బలుకొట్టుకొనువరకు పరిస్థితులువిషమించినట్లును దక్కనున్యూస్ వారివార్త. వారలను మరునాడు చెరి రూ. ౧౦ ల జమానతుపైవిడదలిపెట్టిరట.

---

### మాలు అధికారుల సమావేశము

మాలుశాఖాధికారుల సమావేశము ఒకటి పోయిన గతబుధవారము అందు మాలుబాకీకచ్చేరీలోజరిగెను. అబ్కారీశాఖలోవలెనే మాలుశాఖలోను మదరాసుపద్ధతిని ప్రవేశపెట్టు విషయమై ఆలోచనలుజరిగెను.

---

### ఆంధ్రపస్తాదు, సవాలు

౧౯౩౬లో కలకత్తాలో ప్రపంచప్రఖ్యాతియనుటకనుగుణముగా పతకముపొంది నవాబు సాలార్ జంగ్ గారి పోషణయందు సుఖముగా హైదరాబాదులోనుంటున్న ప్రొఫెసర్ లక్ష్మీనారాయణనాయుడు రుస్తుంహిందుగారు తనతో బలప్రదర్శనమందు పోటీ చేయవలసినదని ప్రపంచమందుగల బలవంతులందరిని సవాలు చేయుచున్నాడు. అట్లుపోటీ చేయదలచువారలు "సికింద్రాబాదు, మారేడ్పల్లిలో ప్రొఫెసర్ లక్ష్మీనారాయణనాయుడు" గారిపేర తెలుపవచ్చును. ఇదే సందర్భములో ఉత్తరహిందూస్థానమునుండి ఒకహిందువున్ను, అమెరికానుండిఒకరును లక్ష్మీనారాయణనాయుడు గారిని ఓడించదలచి బయలుదేరివచ్చుచున్నారు.

---

### బాలికలఉన్నతపాఠశాల(సుల్తానుబజారు)

#### మందిర నిర్మాణనిధి

శ్రీయుత అక్కినేపల్లి జానకిరామారావుగారు జమిందారు కొండగడప (హైకోర్టువకీలు) బాలికలఉన్నతపాఠశాల మందిరనిర్మాణనిధికి దానముగానమొనర్చిన వేయిరూపాయిలలో మొదటికిస్తుబాపతు అయిదువందలు దయచేసినారు. కార్యనిర్వాహకవర్గమును కృతజ్ఞతాబద్ధులనుగా నొనర్చినది.

---

### యువజనసంఘము

(పీలుఖాన హైదరాబాదు)

ధాతనామసం॥ జ్యేష్ఠ బ౹ ౩ం గురువారము (౨ శిహ్రూరేవరు ౧౩౪౬—రాత్రి ౧౯౩౭) నాడు పీలుఖాన, ఆంజనేయ దేవాలయములో సాయంకాలము ౬గంటలనుండి శ్రీయుత కొండా వెంకటరంగారెడ్డి యం.ఎల్.సి., హైకోర్టువకీలు, అయిదవ ఆంధ్రమహాసభాధ్యక్షులుగారి అధ్యక్షతన యువకులకర్తవ్యమును గూర్చి ఉపన్యాసములు జరుగును.

శ్రీయుత సురవరం ప్రతాపరెడ్డిగారు బి.ఏ.,బి.ఎల్. హైకోర్టువకీలు

శ్రీయుతఖండవల్లిలక్ష్మీరంజనంగారుయం.ఏ. ఉస్మానియా యూనివర్సిటీ ప్రొఫెసరు.

శ్రీయుత బిరుదు వేంకటశేషయ్యగారు,బి.ఏ. ఉన్నతబాలికాపాఠశాల ఉపాధ్యాయులు, మరియులుగూడ ఉపన్యసింతురు.

షరా:-స్త్రీలకు ప్రత్యేకస్థలముగలదు.

పి. లక్ష్మీనారాయణరావు
కార్యదర్శి,
యువజనసంఘము.

వచ్చి యున్నది.

స్థాపితము 1884 మైసూరు మహారాజాగారి కృపా పోషితులు స్వర్ణోత్సవము 1934

## గుబ్బి శ్రీ చెన్న బసవేశ్వరస్వామి సంగీత మండలి. రిజిష్టర్డు మైసూరు

హైదరాబాదు పుత్లిబౌలిడి సమీపమున వారి స్వంత ధనలక్ష్మి థియేటరులో

# కురుక్షేత్ర లేక భగవద్గీత

(కన్నడములో)

ప్రతిదినము9-30 ఘంటలకు ప్రారంభింపబడును

5—7—37 సోమవారము కురుక్షేత్ర 7—7—37 బుధవారము సదారమ

తిరిగి కురుక్షేత్రముచూపబడదు-

## వినోదరత్నాకర జి. హెచ్. వీరన్నగారు

స్వయముగా

వీరిఘనతకు కారణములైన వేషములన్నియు ధరించెదరు. ఇటి నటకోత్తంసమును చూచియుండరు.ఇకముందు చూడబోరు- తరుణము మించిన విచారించి లాభములేదు.

**సదారమలో ఆదిమూర్తి యను కోమటి వేషమును మైసూరు గజదొంగ వేషమును ధరింతురు.**

అందరి ప్రోత్సాహము కావలయును

యస్. పి. నరసింహమూర్తి ఎం. ఏ.
మేనేజర్

వినోద రత్నాకర
జి. హెచ్. వీరన్న
హాస్యకళానిధి ప్రొప్రైటర్






ఈ శాస్త్రీయమైన క్రీంరోమములను బాధ లేకుండాను, త్వరగాను పోగొట్టి చర్మమును నునుపుగా చేయును. గొప్ప ఇండ్లవారు కూడను ఉపయోగించుచున్నారు. పెద్దగొట్టము ౧౨ అణాలు పెద్దసీసా రూ౧. వి. పి. చార్జీలువేరు. ప్రతిచోట అమ్మబడును, సోల్ ఏజంట్లు నిశలాల్ అండ్ కో, ప్రిన్సెస్ స్ట్రీట్. బొంబాయి.



## నెఱసిన వెంట్రుకలు నల్లబడుటకు



నీవెంట్రుకలెంత నెఱసినను, విశ్వమైన హెయిరాయిలు వాడినచో, వాటికి సహజమైన నల్లని నిగనిగ కుదుళ్లనుండియు ఏర్పడును. మందు చల్లగా పనిచేయును. రంగులువేయవలదు- విశ్వమైన నేటి నుండియే ప్రారంభించుము- నెఱపుపట్టిఎక్కువకాలమైనచో పెద్దసీసా రూ 3 లు చిన్నసీసా రు ౧-౧౨-౦ లు మూడుసీసాలు [పూర్తిగాగుణమిచ్చుటకు] కొన్నచో టపాఖర్చు మేమేధరింతుము-

డిస్ట్రిబ్యూటర్లు:- యస్. పి. అండుకో, [మెడికల్ డిపార్టుమెంటు, పి-ఓ-బాక్సు ౧౦,౨౦౬,కలకత్తా, [౧౫]



# వీర్యస్తంభన రసాయనము

## ౫ గంటలు వీర్యము ఆపును.

అనేక వనమూలికలు. విలువగల్గిన భస్మములచేతను తయారుకాబడినది నీరైన వీర్యమును ఘట్టిపర్చి మూత్రములోపోవుట, అతిశీఘ్రస్ఖలనముఆపి అసలు స్త్రీవాంఛయేలేని నపుంసకులకుసహితము లింగవరములు పుష్టిచే లింగము లావు,పొడవు, బలిష్ఠముగలిగి స్త్రీనిజూచినంతమాత్రముననే విశేషము కామోద్రేకముకలిగించి ౪-౫ గం టలవరకు, వీర్యస్ఖలనకాకుండ ఆపుజేసి తృప్తిదీరునట్లు సంభోగ సౌఖ్యము యిచ్చుటకు గ్యారంటీ. మందు ౪౦దినములకు,ఒకడబ్బి రు, ౫-౦-౦ వి. పి. ఖర్చు౦-౬-౦ కాంకలుగాని విడిగాఅర్ధడబ్బీలుగానిదొరుకవు. నిజము పరీక్షించండి. డాక్టర్ రత్నం(బదర్సు) మెడికల్ హాల్ ౨౫౨- బి మలకపేట, హైదరాబాదు.



# పరిశీలనతో చిత్తగింపుడు

**1936—37** సంవత్సర ఫలితములు ( 12 నెలలు 1-4-36—31-3-37)

## సర్వతోముఖమగు అభివృద్ధిని సూచించుచు చాల సంతృప్తికరముగనున్నవి:

| | |
|---|---|
| క్రొత్తవ్యాపారము: | రు **33** లక్షలు |
| భీమానిధి: | **15½** ,, |
| సాలీనా ఆదాయము | **6¼** ,, |

**1935లో**

| | |
|---|---|
| క్రొత్త వ్యాపారము | **27** లక్షలు |
| భీమానిధి | **12** ,, |
| సాలీనా ఆదాయము | **5** ,, |

ఇంకను జయప్రదమగు భవిష్యత్తున కెదురుచూచుచు,
ఇంకను అత్యధికమగు ప్రజామోదమును, విశ్వాసమును
బడయుటకు మీయెల్లర తోడ్పాటు నర్థించుచున్నది.

## ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, (లిమిటెడ్)

మచిలీపట్టణము

గా. జగన్నాథం
నిజాంరాష్ట్రమునకు చీఫ్ఏజంటు

## సరిహద్దులో యుద్ధము

జూలై ౨౩ వ తేది టోచిఖ్యాట్యురజ్ మక్ సమీపమునందున్న ఒక గ్రామమును ముట్టడిచేసి, నేరస్థుడగు ఒక కొండజాతివానిని పట్టుకొనెను:

వివిధ ప్రాంతములలోను ౨౭వ తేదిరాత్రి శాంతముగా ఉండెను. ౨౮ వ తేది ఉదయము పంజాబు సైన్యమునకు మంచినీటిని సప్లై చేయువారువచ్చుచుండగా బన్ను, మిరాలిమధ్య కొండజాతులవారు కొందరు వీరిపై తుపాకులను ప్రేల్చిరి. ఈకొండజాతులవారిని తరిమివేసిరి. భారతీయుడొకడు గాయపడెను. లారీలలో సైనికులు స్పిన్ వాంవెల్లి ఎట్టిఅటంకము రకుండా నే మిరాలికిమరలి రాగలిగిరి. మారియంశిబిరములో గాని, టియర్జాశిబిరములలో గాని ఎట్టిఅటంకము లేకుండెను.

నేరవంగిన రైలోనకు కొండజాతుల నాయకునితో ౩౦ జూను వాడు పోరాటములో ప్రభుత్వప్రతికూలపక్షమున ౨౭ మంది చనిపోయిరని ప్రభుత్వప్రకటనలోగలదు. ప్రభుత్వపక్షమున ఇద్దరుగుర్ఖాలు చనిపోయిరి. ౫ గురు గుర్ఖలకుగాయములు తగిలెనట. లాఖ్కురులో న శీకుస్థానము సైనికులు పోరాటము సాగించిరి.

ఇటీవల స్వాత్ ప్రాంతములో మరల ౨౮ జూలై వాడు గందరగోళ మేర్పడెను. దీనికి కారణము దూబరు ప్రాంతమునువశపరచుకొనువిషయములో వివాదమునిశలచుచున్నారు. అంతకుముందే దూబరునుండిమాలీలు కొందరు స్వాత్ వలీవద్దకుపోయి సింధునది కోహిస్థాన ప్రాంతముపై వారిఅధికారమునక్షిపడెదమనిరి–కాని దీనికి ప్రాతికూల్యమేర్పడుటచే చిక్కులటస్థించెను– స్వాత్ వలీగారు ఈతిరుగబడినవారలను అణచుటకు ౨౦౦౦ మందిని పోరాడ నియోగించవలసివచ్చుచున్నది–

### సముద్రతీరసంస్థానములు భారతప్రభుత్వముతో ఏర్పరచుకొన్న క్రొత్త ఒడంబడికలు

ఇండియాప్రభుత్వము సముద్రతీరమునన్న సంస్థానములతో సుంకముల విషయమున చేసుకొనవలెనని యుండు సమాధానము చాలావరకు కుదిరినది. భావనగరు, జాంజీరా, మొదలగు కధియవారుసంస్థానములు, పూర్వము ఒడంబడికలమూలమునతమకేర్పడియున్న హక్కులకుభంగమువాటిల్లునని మొదటఅక్షేపించియుండినను బ్రిటిషిండియాలోని సుంకముల విధానమును సంరక్షించుటకై ఒక సమాధానమునకు అంగీకరించెననియు తెలియుచున్నది. కాని సంధిషరతులేవో తెలియకున్నవి. బరోడాయును, ఇతరసంస్థానములును ఒడంబడికలను చేసికొనినవి. కనుక కేంద్రశాసనసభ సిమ్లాలో కూడినపుడు యీవిషయమునుగూర్చి ఒకప్రకటన గావించబడును.

### ఒరిస్సా శాసనసమావేశము

ఒరిస్సా తాత్కాలిక మంత్రివర్గముపై విశ్వాసము లేనట్లు ప్రకటించుటకు,శాసనసభ వెంటనే సమావేశపరుపవలెననికోరుచు అసెంబ్లీ కాంగ్రెసుపార్టీసభ్యులు ౩౫ మందిసంతకములు చేసినవిజ్ఞాపనపత్రమును కాంగ్రెసు పార్టీనాయకుడు గవర్నరుకుపంపియుండెను. ఈలేఖకు ప్రత్యుత్తరమొసంగుచు ఒరిస్సాగవర్నరు కార్యదర్శి కాంగ్రెసుపార్టీనాయకునకు "ఒరిస్సా శాసనసభ జూలైమాసమున ఆఖరువారములో సమావేశపరుపబడు"నని వ్రాసిరి.

---

ఛగన్ లాల్ నారాయణ్ జీ

అత్తరు వ్యాపారులు

మచ్లీకమాన్, హైద్రాబాదు

మావద్ద అన్నివిధములైన స్వదేశీ అత్తరు తైలములు, అగరుబత్తీలు, కుంకుమపూవు, చాయపత్తీలు జర్దా మొదలగునవి అమ్మబడును.

## వెట్టిచాకిరీ పరిస్థితుల విచారణ

ఒరిస్సాసంస్థాన ప్రజాసభ వారు ఇండియాప్రభుత్వమునుకోరుట

### మహాసభలో తీర్మానములు

అ–భా– సంస్థానప్రజాసభ అధ్యక్షులగు డా॥ పట్టాభిసీతారామయ్యగారు ౨౨ వ తేది రాత్రి కటుకమునకువచ్చిరి– ఇచట జరిగిన ఒరిస్సారాష్ట్రసంస్థానప్రజాసభకువీరుఅధ్యక్షత వహించిరి– ఐదేండ్లక్రిందట దీని ప్రథమసమావేశము జరిగియుండెను– ఆహ్వానసంఘము వారును,అంధ్రులుపలువురును రిక్షస్టేషనువద్ద సన్మానమొసంగిరి–

సాయంకాలము ౫ గంటలకుసరిగా మహాసభ మునిసిపలుమందిరమునందు ప్రారంభమయ్యెను– సభామందిరము వివిధప్రాంతముల ప్రతినిధులతో సభనిండియుండెను– వివిధసంస్థానములనుండి పలువురు సి–ఐ–డి–రిపోర్టరులువచ్చియుండిరి– ఆహ్వాన సంఘాధ్యక్షుడు ౨౪ జూలై ఉపన్యసించిరి–

### తీర్మానములు

ఒరిస్సా సంస్థానములనివాసులగు ప్రజలకు తామే చట్టములు న్యాయశాస్త్రము ప్రకారము పరిపాలింపబడుచున్నారో తెలియుటకు అవకాశము లేదుగావున, సంస్థాన పాలకులుతాము అనుసరించుచున్న బ్రిటిషిండియా చట్టములను, ఇతరచట్టములునుగూడ ప్రజలకు తెలయునట్లుప్రకటింపవలసినదిగా కోరుచుతీర్మానించబడెను–

సంస్థానాధీశులు తమప్రజలకు జిరాయితీ హక్కును, పౌరత్వపుహక్కులు ఒసంగవలసినదిగాకోరుచు తీర్మానించబడెను–

ఒరిస్సావిశ్వవిద్యాలయస్థాపనకుసంస్థానము ప్రజలును, సంస్థానాధీశులును ధనసహాయము చేసి. ఒరియావిజ్ఞానాభివృద్ధికి తోడ్పడవలెనని కోరజడెను–

ఉద్యోగములందు, విశ్వవిద్యాలయపరీక్షలు స్కాలర్ షిపులందు సంస్థానప్రజలకును బ్రిటిషు రాష్ట్రప్రజలకును వ్యత్యాసము చూపరాదని బ్రిటిషిండియాప్రభుత్వమువారిని సంస్థానాధీశులనుగూడకోరుచు ఒకతీర్మానము చేయబడెను–

అంతర్జాతీయకార్మికసభవారి ౧౯౩౦ సం॥పు తీర్మానము పకారము వెట్టిచాకిరిపద్ధతిని తొలగించుటనుగూర్చిన ఇండియాప్రభుత్వ ప్రకటనను సభవారు మెచ్చుకొనుచు. సంస్థానములందున్న యీదురాచారముపట్ల తీవ్రఅసమ్మతి తెల్పుచు. ప్రజలను సంస్థానాధీశులు పన్నులవసూలు చేసియు, వెట్టిచాకిరిచేయించుకొనియు అందువిషయములహింసింపక వెట్టిపద్ధతిని తొలగింపవలెననికోరుచు, యీపద్ధతిసంస్థానములందు తొలగింపబడినదనుప్రతీతి యెంతవరకునిజమో తెలిసికొన విచారణజరుపవలసినదని ఇండియాప్రభుత్వమువారినికోరుచు ఒకతీర్మానము గావించబడెను–

కొన్నిసంస్థానములందుజరుగుచున్న చర్యలనుగూర్చియు, సంస్థానాధీశుల నీచపుఅలవాటులనుగూర్చియు, అక్రమచర్యలనుగూర్చియు, చెప్పరానిచేష్టలనుగూర్చియు విచారించి కార్యవర్గమునకునివేదింప ఒకఉపసంఘము నియమింపబడెను.

సంస్థానప్రజాసభకు చందాలను వసూలుచేయుచున్న బాబుదయానందు ఫతేశరిగారిపైని బామ్రాసంస్థానమునందు కుంచింద మేజస్ట్రేటు ౧౪౪ సెక్షనుప్రకారము నిషేధపుటుత్తరువును ఒసంగుటను విరసించుచు తీర్మానింపబడెను–

### ఫెడరేషనునిరసనము

ఇండియాప్రభుత్వచట్టమునందు సూచింపబడిన ఫెడరేషను తరియైనదికాదనందునను, ఫెడరలుశాసనసభలో అన్నిసంస్థానములకు ప్రాతినిధ్యము ఉండుటకు అవకాశము లేనందునను ఫెడరలుకోర్టునందు సంస్థానప్రజలసామాన్యపౌరత్వపుహక్కులను కాపాడుటకైన అవకాశము లేనందునను, యిందు చేరుటకువీలులేదని తీర్మానించబడెను–

## నవాబ్ బహదర్ యార్జంగ్ గారి అధ్యక్షతన మహమ్మదీయ యువజనసభ

బెజవాడ, జూలై ౨౦:—

బెజవాడ మైలవరం హాలునందు. మహమ్మదీయ యువజనసంఘ సమావేశము అల్హాదమౌలానా నవాబ్ బహదూర్ యార్ జంగ్ బహదూర్ హైదరాబాదు వారి అధ్యక్షతను సమావేశమయ్యెను. అందు మసీదు, ఫార్మరు మీటింగుకు హాలావా యస్. ఎ. దబ్లియు. బాకారి సాహెబు గారధ్యక్షులుగను. ఎవమిన్ రెక్షన్ సభకు మదరాసు వాస్తవ్యులగు మవులానా సయ్యద్ అకీజుద్దీన్ అహమ్మదు సాహెబుయం. ఏ. బి. ఎల్. గారునూ, ఉర్దుసభకు ఔరంగాబాదు వాస్తవ్యులగు మౌల్వీ అబ్దుల్ హక్ సాహెబుగారునూ అధ్యక్షతవహించిరి. అన్నిసభలయందును మహబూబ్ అలీబేగు సాహెబుగారు మవులానా బిభానిసాహెబు గార్లున్నూ, మవులానా ఉమర్ అలీషాకవి యం.ఎల్.ఏ.గారునూ ఉపన్యసించిరి. ఆఖరున యీక్రిందితీర్మానములు అంగీకరించబడెను.

దేశమునందు స్వదేశీవస్తువులు వృద్ధిపరచవలసినదనియు, మద్రాస్ యూనివర్సిటీవలెనే చిదంబరం అంధ్రా యూనివర్సిటీలందు డిప్లొమాలు ఉంచవలసినదనియు, యూనివర్సిటీయందు తెలుగు రెండవ సబ్జక్టుగా వుండవలెననే గవర్నమెంటు ఉత్తరువును గవర్నమెంటువారు రద్దుచేయవలసినదిగానున్నూ, జిన్నా గారి వాయకత్వమునందు ఈసభవారికి సంపూర్ణవిశ్వాసము కలదనియు, కాంగ్రెసువారికి జిన్నా గారు ఇచ్చిన పదునాల్గుపాయింటులు సంతృప్తికరముగా పరిష్కరించిన మహమ్మదీయులందరు కాంగ్రెసులో చేరెదరనియు, మహమ్మదీయులు కోరునది పూర్ణస్వరాజ్యమేననియు, దానినిమిత్తం పాటుపడువారందరితో సహకారము చేయుటకుఏమీ అభ్యంతరములేదనియు తీర్మానించిరి. మరియు దేశమునందు కొన్నిచోట్ల హిందువులకు, మహమ్మదీయులకు, సిక్కులకు మతసంబంధమైనతగాదాలు జరుగుచున్నవిగనుక అన్నిపక్షముల నాయకులునూ ఆటులముందు జరుగకుండులాగున తగినచర్య తీసుకోవలసినదనియు, మహమ్మదీయుల మతబోధన తగినపాఠశాలలు ఏర్పరచవలెననియు తీర్మానములు చేయబడెను. [అంధ్ర]

### ప్రాతఋణము తీర్చుటకు క్రొత్త ఋణము

రాబోవు అక్టోబరునెల ౧౫ తేది నాటికి ౫౪ వంతువడ్డీతో మొత్తము రు ౧౭ లక్షల ఋణమును పంజాబుప్రభుత్వము తీర్చవలసియున్నది. ఈబాకీతీర్చుటకుగాను ప్రభుత్వమువారు క్రొత్తఋణము చేయుదురని తెలియుచున్నది. క్రొత్తఋణము చేయుదుమని పంజాబుప్రభుత్వమువారు క్రిందటిసం॥ రిజర్వుబ్యాంకుతో ఒడంబడిక చేసుకొనియుండిరి.

### స్త్రీలసమ్మె

కలకత్తాలోని బెల్వీడర్ జనపనారమిల్లులో సమ్మెకట్టినకూలీ స్త్రీలు ఎట్టిషరతులుకోరకుండానే ౨౨ జూను నాడు మరల పనిలో చేరిరి,

---

తరువాతసభానిర్మాణవిధానము నిర్ణయించబడెను. సంస్థానప్రజలు బాధ్యతాయుతపరిపాలనముబడయుటఆదర్శముగనిర్ణయించి, ౧౫ సంవత్సరముల పైబడినవారు యీసభలోసభ్యులుగనుండుటకుఅంగీకరించబడెను–ఒరిస్సాసంస్థానప్రజాసంఘమొకటి స్థాపించబడెను– ఈసభకేంద్రస్థానము కటకముగా నిర్ణయింపబడెను– ఒరిస్సాసంస్థానములన అ–భా–సంస్థానసభాశాఖగానుండుట కంగీకరించుచు తీర్మానింపబడెను–

## చైనాలో జపానువారి బలమున్నచోట నల్లమందువ్యాప్తి

జాతిసమితిని వేదిక

జనీవా; జూలై ౧౫:–

నానాజాతిసమితి ఆహార ఉపసంఘమువారు ఆహారపదార్థములనుగురించి ఒక నివేదికను తయారుచేయుచున్నారు– అనివేదికయందు, వివిధదేశములప్రజల ఆహారములు, వారిఅలవాటులు, ఏ ఏదేశములయందు యేయేపదార్థములు పండుచున్నవి, ఏపదార్థపుఖరీదు యెట్లున్నది– మొదలగువిషయములన్నిటిని గురించి ప్రకటించెదరు–

నానాజాతిసమితివారి ఆరోగ్యసంఘ సమావేశమును మెక్సికోయందు జరుపవలయునని, మెక్సికో ప్రభుత్వమువారు కోరిరి– ఈసమావేశము ౧౯౩౯ సంవత్సరాంతమున మెక్సికోయందు జరుగును–

మేమాసమున సమావేశమైన జాతిసమితివారు అలెగ్జాండ్రెట్టానుగురించి టుర్కీ, ఫ్రాన్సు ప్రభుత్వములవారు చేసికొనిన రాజీని తమరికార్యతలోనికెక్కించిరి– టుర్కీకిని, ఫ్రాన్సుకును మధ్యవర్తిగా స్వీడన్ ప్రతినిధి పనిచేసెను–

### చైనాలోనల్లమందు

చైనాలో జపానువారి పలుకుబడివున్నభాగములందు నల్లమందుఉత్పత్తి, వ్యాపారము ఎక్కువగాఉన్నది– జపానువారి పలుకుబడిలేనిచోట నల్లమందువ్యాపారమును ఉత్పత్తినితగ్గించుటకు చేసినప్రయత్నము చాలవరకుఫలించినది– ఈనల్లమందువలన చైనాదేశమునందలి ప్రజలుఎందుకును కొరగానివార్నై, దుర్బలులగుచున్నారు– చైనానుండి నల్లమందును దొంగతనముగా యితరదేశములకు యెగుమతిచేయుచున్నారని యీజిప్టుదేశపు ప్రతినిధి, నానాజాతిసమితి సమావేశమునందు వెల్లడిపరచెను–

### లండన్ మెడికల్ కౌన్సిల్ కలకత్తాడిగ్రీల ఆమోదించుట

కలకత్తా విశ్వవిద్యాలయమునకు చెందినకలకత్తా, కార్మికల్ మెడికల్ కళాశాలల డిగ్రీలను లండన్ మెడికల్ కౌన్సిల్ వారు ఆమోదించుటకు ఒప్పుకొనిరి–

---

## ఇస్తెహారు

యిస్తెహారు మహకమా సజామతు ఆబ్కారి మామాలికు మహరూసా సర్కారుఆలీ తా॥ ౧౮ అమర్దాదు సన్ ౧౩౪౬ ఫసలీ.

బఖిద్మతు జాగీరుదారుసాహెబాన్ మక్తేదారుసాహెబాన్ మహాజె మఖ్జాతు జాగీరాత్ వ మహాజెమ ఖ్జాతు ఆమదని సేంది యొక్క సువ్వంకిస్తున్న ౧౩౪౭ సాలు అదాయితారీఖు ౫ వ షహరేవరు స్న ౧౩౪౭ సాలునుంచి కాగలదు. చెక్కుల తక్సీము (౫) వ షహరేవరు స్న ౧౩౪౭ సాలు ఆదివారమునుంచి (౧౧) వ షహరేవరు స్న ౧౩౪౭ సాలు శనివారమువరకు యీమహకమాలో జరుగుతువుండగలదు.

యేజాగీరుదార్లు అయితే చెక్కులు తీసుకునేకొరకు స్వంతముగ రాజాలరో వారలు తమతమ గుమాస్తాలు నవుకర్లు జర్యాన చెక్కులు తెప్పించుకొనవచ్చును. ఫక్తు.

హాస్బె తజువీజు యిజ్లాసు

సదద్గారు నాజం ఆబ్కారి

౧౦వ పేజీ తరువాయి

మోలేను—అదియునుగాక బ్రిటిషు పార్లమెంటువారియత్నము ఎంతవఱకుటికిని భారతదేశమునుతమ అధికారముక్రిందనుంచుకొని, తాము లాభము పొందుటగాక అన్యథా యుండునని నమ్మకము భారతదేశముయొక్క—సంపద భారతీయులకేవినియోగము కావలెను, భారతదేశము ఇతరదేశములవలెనే బడని స్వతంత్రరాజ్యముగనుండవలెనని యత్నించు కాంగ్రెసువారికిఎట్లుకలుగవలెను? లేకపోతే కాంగ్రెసువారుమనస్సులో మంత్రిపదవులుస్వీకరించి కాంగ్రెసుబలమును వృద్ధిచేసికొనుటకు యత్నించెదమని ఏదేనిదురుద్దేశ్యమునుగాని, లేకఇప్పుడు జనులలో తిరుగుబాటు చేయుశక్తి లేదుకనుక ఊరకఉండి లాభమేమి, కాంగ్రెసు నాయకులు కొందరు మంత్రులై కొద్దియోగొప్పయో దేశహితనిర్మాణకార్యక్రమమును నడిపించుచు, విశ్రాంతగానుట మంచిదనుఆశయముతో కొనియో మంత్రిపదవులుస్వీకరించవలసినదేగాని, బ్రిటిషువారు భారతదేశమంత్రులకు గొప్పగొప్ప అధికారములిచ్చుచున్నారు—అనుగట్టినమ్మకముతో మంత్రిపదవులనుస్వీకరించవీలులేదు—కనుక ఏవోకొన్ని షరతులను గవర్నరులుఅంగీకరించినచే మంత్రిపదవులనుస్వీకరించెదమని భీష్మించవలసిన పనిలేదు. కాని గాంగ్రెసువారు అట్లుభీష్మించి ప్రజాభిప్రాయమును బ్రిటిషుప్రభుత్వాభిప్రాయమునకువ్యతిరేకమునుగా చేయుచుండుటవలన బ్రిటిషుప్రభుత్వమువారిహృదయములో ఒకవిధమైన భయముకలిగియుండవచ్చును—దానికి నిదర్శనము గవర్నరుల ప్రత్యేకాధికారముల విషయమై లిన్లిత్గో గారుచెప్పిన అభిప్రాయమే.

## రాజీనామా బర్తరఫా?

ఇక గాంధిమహాత్ముడు గవర్నరులకుమంత్రులకు భేదాభిప్రాయము ఏర్పడితే తొలగవలెను గవర్నరుమంత్రులను బర్తరఫు చేయుకున్నను నిర్బంధముగా రాజీనామా పెట్టించవలెనను షరతువిషయములో లిన్లిత్గో జెట్లండు గారు చెప్పిన అభిప్రాయము చాలచమత్కారముగ చెప్పినారు. జెట్లండుగారు మంత్రులు గవర్నరు ఒకవిషయములో భేదించినను మంత్రులు ఉద్యోగములోనే ఉండవలసినచో దానికి అంతరాయము కలిగించరాదుఅను ఉద్దేశ్యముతో శాసనములో బర్తరఫుగాని నిర్బంధమగు రాజీనామాపద్ధతిగాని సూచించియుండబడలేదనిరి. కాని ఆదేకాంగ్రెసు పెద్దలగు జవహర్లాలు బోంట్లకు ఇష్టముకాలేదు—మంత్రివర్గమిచ్చిన సలహాలో గవర్నరుకువిశ్వాసము లేనప్పుడు ఆ గవర్నరువద్ద ఇంకనుమంత్రిగా ఎవరైన మర్యాదగలవాడుఉండజాలడు— ఎవడయిన ఉండుచో ఏదిఎట్లైననేమి, నాదబ్బునాకువచ్చిన చాలుననువాడేయుండవలెను—కనుక మంత్రి చెప్పిన సలహాలను గవర్నరువినకప్పుడుకూడ ఆ మంత్రి తననౌకరివదలకుండుట కాంగ్రెసు సంస్థకు అప్రతిష్టయని జవహర్లాలుబోంట్ల హృదయము. అట్టిఅప్రతిష్ఠ కాంగ్రెసుకుకలుగకుండుట ఎట్టి అవకాశముఉండరాదని వారలుయత్నింతురు_ కనుకనే మంత్రిపదవుల స్వీకరణయన్న మాటయే వారలకుగిట్టుటలేదు

ఇందుకులిన్లిత్గోగారుచేసిన చిత్రమేమనగా, బర్తరఫుచేయుట కాంగ్రెసుమంత్రులకేఅగౌరవమనియు. నిర్బంధమైన రాజీనామా చేయించుటయుదాదాపు బర్తరఫుతో సమానమేనని సూచించిరి—కనుక మంత్రులే రాజీనామానిచ్చుట వారికేగౌరవము ఆదిరేమేఆ: తెలుసు ఆచారమని—

అంతకాంగ్రెసువారలతో తట్టుకొనరాని అవసరమువచ్చినచో, గవర్నరుమంత్రులనుబర్తరఫుచేయుటకు వెనుదీయరనిరి. కాని ఇంతమూత్ర గాంధిమహాత్ముని కోరిన షరతులభించలేదు గాంధీమహాత్ముడు చేయుట సూచ్చినచోట నెల్లమంత్రులబర్తరఫుకోరియుండ, లిన్లిత్గోగారు గవర్నరుకిష్టమువచ్చినపుడే అట్టిబర్తరఫు నిర్ణయించిరి_గాంధిగారు గవర్నరుపై సొద్దుమోప యత్నించ. అదితప్పించుటకు వైస్రాయి యత్నించెను.

## బెదరింపు

వైస్రాయిగారి ప్రకటనలో తుదియంశము బెదరింపు—కాంగ్రెసువారు, ముఖ్యముగా సోషలిస్టులు రాజ్యాంగమునాగకుండ ప్రతిబంధనచేసి గవర్నరేరాజ్యపాలనభారమంతవహించునట్లు చేసి రాజ్యాంగము సాగకుండ చేయబడినదిఅని చెప్పుకొను సమయము ఎప్పుడు వచ్చునాయని ఎదురుచూచుచున్నారు— మేము అందుకు సిద్ధమేనని లిన్లిత్గోగారు ధైర్యముగా సూచించి కాంగ్రెసువారిమాట విలువ తగ్గింప జూచినారు—కానితుదకు మరల కాంగ్రెసు వారిని సూచనగాసాగనీ, లాలించువాడు కూడ.

---



# ఉద్యానకృషి— జ్యేష్ఠమాసములో చేయవలసినపనులు

వ్యాసకర్త:
డాక్టర్ పి. లింబాద్రిరెడ్డిగారు

తోటలువేయువారికి నెల అమూల్యమైనది— చాలజాగ్రత్తగా పనిచేయవలసిన అవసరముగలదు— ఇంతకుపూర్వమే నేలనుసిద్ధము చేసి యుంచినదానిలో ౧౪ అడుగులోతువరకు భూమిని పెళ్లగించి అందులో పశువులపెండ, పక్షులరెట్ట, గుల్లపుల్లద్ది మొదలగువాటితో సిద్ధము చేయబడిన ఎరువులను కప్పిపెట్టవలెను. వర్షపునీటితో కలసి భూమి సారవంతముగానగును— గతనెలకన్న ఈనెలలో భూమిచల్లబడియుండును— కావున ఈనెల ఆఖరులోనే విత్తనములు నాటవలసినకాలము కావున అప్రమత్తతతో పని ముగించి వర్షముకై నిరీక్షించియుండవలెను— తీగజాతిలో వేయవలసినకూరగాయలకిదేసమయము. అందులో చిక్కుడు, బీర, పొట్ల, అనగము, గుమ్మడి, కాకర, దోస మొదలగునవి విత్తనములు నాటబడును—

పొదజాతిచెట్లు చెమ్మ, టమాటో, బీనిస వంకాయ, బెండ మొదలగునవి— విత్తులునాటవలసినది— నాటుపోయవలసిన దిదేసమయము— మిరప మొదలగు సామాన్యజాతులు వేయవలసినకాలమిదేయని తెలిసియున్న విషయమే కాన విస్తరింపబడలేదు—

మామిడి, నిమ్మ, దానిమ్మ, జామ, కమలా నారింజ, సపోటా, జాంబు, పోక, కర్జూర, కొబ్బర, మొదలగుజాతుల నాటుపోయుకాలముకూడనిదియే—

పుష్పజాతులు— అన్నియుకూడ నిప్పుడే నాటుపోయుట యుక్తము [ముందుముందు కాలము ననుసరించి సూచించుచుందును.]

---


# బలపపురాతి సున్నము

యొక్క ప్రఖ్యాతి దాని మంచితనమనే అద్దములో గానవగును.

బలపపురాతి సున్నముచే నేయబడినకప్పు తక్కువలోతక్కువ నూటికి ౨౦వంతులు చౌకపడును.

ఘట్టితనము మరియు కట్టడపు సౌకర్యములలో నూరురెట్లుమెక్కువ.

మా గోదాములో చూచి పరీక్షించుకొనవచ్చును.

1 కప్పుమీద నీళ్ళు నిలిపి చూడుడు. 2 బరువువేశి చూడుడు.

## హైదరాబాదు మార్బుల్ వర్క్సు

Saba   హైద్రాబాదు-దక్కన్.





మీ సతీసుతలకు
సహాయహస్తము.

ఋతుసంబంధమైనదోషములను పారద్రోలి ఆరోగ్య జీవనమును ప్రసాదింపగల ఔషధరాజము

లోధ్ర

గర్భాశయ రోగములను నిర్మూలనమొనరించి సత్సంతానమునకుమార్గము చూపునది.

లోధ్ర

కేసరి కుటీరం
ఎగ్మూరు
మద్రాసు



## పాలిసీలు హాలీనాణెములో ఇవ్వబడును

స్టార్ పాలిసీలు రద్దుకానేరవు. పట్టాలు హాలీలో జారీచేయబడును. అపాయకాల విస్తరణ, ఆకస్మిక ప్రమాద మరణమువల్ల రెండింతల లాభము, శాశ్వత అశక్తతలాభములు, సరళమైన సరెండరువిలువలు, గ్యారంటీచేయబడిన బోనసులు యింకను మెన్నియో లాభములు గలవు. వివ్రాయుడు.

## స్టార్ ఆఫ్ యిండియా: ఐ. అండ్ జి. అష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్ (మదరాసు)

బ్రాంచి:— హనుమకొండ (దక్కను)

చదువుకొన్న ఏజంట్లు కావలెను—

డివిజనల్ ఆర్గనైజర్:—
విఠాంరాష్ట్రమునకు

The best medium for reaching 7 million Andhras, of the State Advertise in Golconda Patrika

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First-Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper of H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు
నిజాంరాష్ట్రపు ఎనిమిది జిల్లాలలోని ...
...
పత్రికలో ప్రకటనము

Vol. 12. | Mondy 5—7—1937 | No. 17

# వైస్రాయిగారు క్రొత్తగా ఏమిచ్చిరి?

వైస్రాయి లిన్లిత్‌గో గారు మాట్లాడక మాట్లాడక ఇపుడు బ్రిటిషు ఇండియాలో రాష్ట్రములయందు ఏర్పడినరాజ్యాంగ ప్రతిష్టంభనమును తొలగించుటకై మాట్లాడినందుకు,దేశములోని అభిప్రాయముచాలవరకు వారిప్రకటనచే సమ్మోహితమైనదన వీలులేకున్నను కొంతఉపశాంతిపొందినట్లు చెప్పవచ్చును. ఇండియాలో కాంగ్రెసుసోషలిస్టు వర్గీయులు మాత్రమున్న ఇంగ్లాండులో సోషలిస్టులకు అనుకూలమైనపత్రికలును మాత్రమేపూర్తిగా నిరసనభావముతో "వైస్రాయి గారిప్రకటన తీవ్రవాదులకు బలమొసంగినది" అనెను. ఇకసామాన్యజాతీయభావముగల పత్రికలును, వ్యక్తులును సామాన్యముగా వైస్రాయిగారు నిష్కపటముగా హృదయమువెలిబుచ్చి సామరస్యము ప్రకటించుచుమాట్లాడినను, అసలుసమస్య ప్రకటనకేమియుతోడ్పడలేదని అభిప్రాయమిచ్చెను.

కొన్నిపత్రికలకును వ్యక్తులకును అట్లుగాక వైస్రాయిగారిప్రకటనలో కొంతతమాషా కనిపించుచున్నది. ఉదాహరణార్థము కృష్ణాపత్రికకు ఈప్రకటన "దీనిలోతేనిపసలేదు" కాబట్టి "గారడీవానిసంచీ"వలెను, ఇందులో "పైవాక్యానికి క్రిందివాక్యం మినహాయింపు క్రిందివాక్యానికి పైవాక్యం కొరుదల." కాబట్టి "కృష్ణాడబ్బిల్యు(బిడ్డ్)"వలెను(పక్కా అంధోచితమైన ఉపమానము)కనిపించినది. మధ్యరాష్ట్ర శాసనసభ కాంగ్రెసు నాయకులగు డాక్టర్ ఖారే గారు కూడా ఇదేస్వరములో "మీకుసమాధానపడ్డతికావలెనా అదిఇంచున్నది, బెదరింపులుకావలెనా అవియుఅందున్నవి."అనిరి. ఈ బెదరింపు సోషలిస్టునాయకులలోనొకరగు యం.ఆర్ మసానిగారికి చాలనచ్చి- "కాంగ్రెసుఇంకను తనవాకిటకిరాక, రాజ్యాంగశాసనమును అపివేయవలసిన అవసరముకలుగుచో, అదిమరలత్వరలో పునరుద్ధరింపబడజాలదు. కాంగ్రెసుఅభిప్రాయమంతయు ఈరాజ్యాంగమును సంపూర్ణముగాను శాశ్వతముగాను అపియుంచవలెననియే,కనుక వైస్రాయి అపనినిచేయుటకంటె మరియొక సంతోషకరమైన విషయము కాంగ్రెసుకుండజాలదు.

ఇక మఱియొకతరగతి దేశీయాభిప్రాయము సత్యమూర్తి గారిలోటివారలది. సత్యమూర్తి గారు శరీరముఅస్వస్థతగానుండి బెంగళూరులో విశ్రాంతితీసికొని ఇప్పుడేబైటపడి చెప్పినదేమనగా, వైస్రాయిగారుసమస్యలో చిక్కులనువిడదీసి తెల్పినారు గనుక కాంగ్రెసువారు మంత్రిపదవులస్వీకారమునకు అనుకూలముగా తీర్మానము చేయుటకు, ఈప్రకటనఎంతయు తోడ్పడగలదని ఆశించుచున్నానని. నిజమే, వారిఆశ ఎప్పుడుతీరునోకదా!

గాంధిమహాత్ముడు ఎట్టిఅభిప్రాయమునకు ఈయక ఆయభిప్రాయమును కాంగ్రెసు కార్యాలోచనసంఘమువారే చెప్పవలెననిరి.జవహర్లాలు గారికి మొన్న మూడునాలుగు రోజులక్రిందటివరకు వైస్రాయిప్రకటనచదువుటకే తీరలేదట! కానిఅందులో ఏమిఅంతక్రొత్తవిషయముండునని తీర్మానించుకొనవే తీర్మానించుకొనినారు. ఇకఆప్రకటనను చదువవలసినఅవసరము మాత్రము వారికేలకలుగవలెను?

వైస్రాయిగారిప్రకటనవెంటనే ప్రతిబ్రిటిషు ఇండియారాష్ట్రపు గవర్న... ముఖ్యముగా రాజ్యాంగప్రతిష్టంభనమేర్పడి యున్న రాష్ట్రముల గవర్నర్లు కాంగ్రెసువారికి వైస్రాయిప్రకటనను శిఫారసుచేయుచు ఉపన్యాసములనిచ్చినారు. శాసనములోతూచాలుతప్పకుండ ప్రత్యక్షార్థముచూచుకొనుటతప్పనియు, లిఖితమైన వాగ్దానములకై పెనగులాడుటఏలననియు, తాము కాంగ్రెసువారు మంత్రులైనను సహకారముతో తోడ్పడగలమనియు అపరిమితముగబుజ్జగించిలాలించుచున్నారు. కాంగ్రెసుశాసనసభలలో అత్యధికస్థానములు లభించనిరాష్ట్రములలోనేగాక తదితర రాష్ట్రములలోగూడ మంత్రులు,అనగా తాత్కాలికమంత్రులు లేకనడుమంతరపుమంత్రులు అనబడుచున్నవారలుకూడ తమకుగవర్నర్లు అడ్డుపడలేదని మూడునెలలఅనుభవము నిరూపించియుండుటవల్ల తప్పక కాంగ్రెసువారలు మంత్రిపదవులను స్వీకరించవచ్చునని శిఫారసుచేసినారు. కాని కాంగ్రెసువారలు ఈనడుమంతరపుమంత్రుల వచనములనుఏమాత్రము సరకుచేయరను సంగతికూడ అనడుమంతరపుమంత్రులకే తెలుసును లెండి.

ఇదంతయుగాక కాంగ్రెసువారలలోని ఇంకొకరకపు అభిప్రాయము నాయకులుగాని సామాన్యులది. వారలకుమంత్రిపదవి స్వీకరణవాదమునందెంతో నివేదించినను అపేక్షించినను ఖేదములేదు- వారలకేమియుమంత్రిపదవులు రావు. కనుకవారలకొకటి లెక్క- ఏదిచూచుటకు తీక్ష్ణముగాకనిపించునో ఆదేపద్ధతి అవలంబించవలెననివారిలెక్క. వానికివ్యతిరిక్తముగా గాంధి, జవహర్లాలు, రాజేంద్రప్రసాదు, వల్లభాయి పటేలు గార్లవంటివారల వచనములు వారలకువినబడినప్పుడే వారలఅభిప్రాయము మారగలదు. అట్టినాయకులుమాట్లాడక తమఅభిప్రాయములను కాంగ్రెసుసభలోనే తెల్పుటకును,వెలుపల ప్రత్యేకముగ చెప్పకుండుటకును నిశ్చయించుకొనినారు.

మదరాసు మెయిలువంటి ఆంగ్లో ఇండియనుపత్రికలు వైస్రాయిగారి ఇంతమంచిప్రకటన ఇదివరకెన్నడో వెలువడియుండిన ఎంతోబాగుండెడిదనుతలచుచు ఎప్పటికైనను వెలువడుటమేలని సమాధానపెట్టుకొని గాంధిగారిని కాంగ్రెసుచేమంత్రిపదవుల స్వీకరింపజేయునట్లు ప్రాధేయపడుచున్నవి. అందును టైమ్సువంటి బ్రిటిషుపత్రికలవిషయము చెప్పబనిలేదు. అవిమొదటినుండికొనవరకు వైస్రాయిప్రకటనను స్తోత్రముచేయుటకె అలసికూడయుండవలెను.

## సత్యమేమి?

రాజకీయనాయకులును, ఏదోయొక రాజకీయసిద్ధాంతమునకుబంధితులైన పత్రికలునుఇచ్చు అభిప్రాయములు సంపూర్ణముగ సత్యములుగనుండవలసినపనిలేదు. మఱి వైస్రాయిప్రకటనలో కాంగ్రెసుకోరిక, గాంధి మహాత్ముడు వెల్లడించినప్రకారము, నిజముగా ఎంతవరకుతీర్పబడినది? ఈవిషయములో లిన్లిత్‌గోగారు భారతరాజ్యాంగ ప్రతిష్టంభనమునుగూర్చిన చిక్కునుతొలగించుటకు తనవంతుకు చివరదానిని చెప్పెదననుచు అతనితో చివరది తనఅభిప్రాయమేగాక గవర్నరులయొక్కయు, సెక్రెటరీ అఫ్‌స్టేటుయొక్కయు అభిప్రాయమని స్పష్టముగచెప్పుటవలన ఇదివరకుసెక్రెటరీ అఫ్‌స్టేట్ అగు జెట్లెండు, అండర్ సెక్రెటరీఅగు బట్లరుగార్లు పార్లమెంటులో చేసినప్రకటనలకును, గవర్నర్లుచేసిన ప్రకటనలకును వైస్రాయి గారిప్రకటన ఎంతమాత్రముదూరముకాదని గ్రహించవలసి యుండును. అట్లైన జెట్లెండు, బట్లరప్రకటనలును, ఇదివరకుగవర్నరులు చేసిన ప్రకటనలును సమస్యాపరిష్కారమునకు ఎంతమాత్రముతోడ్పడుటలేదని తలచబడియుండ, అదేదోషమును లిన్లిత్‌గో గారిప్రకటనకును అంటగట్టవలసి యుండును- కాని దేశములో మధ్యస్థితిపాలు అభిప్రాయము అట్లునక లిన్లిత్‌గో గారిప్రకటనచే సమ్మోహితమైనది-

అయితే వాస్తవములో కొద్దిభేదము లేకపోలేదు. జెట్లెండు, బట్లరుగార్లు, ఇదివరలో గవర్నర్లు విషయమును చెప్పినతీరుకును లిన్లిత్‌గో గారు చెప్పినతీరుకును భేదమున్నది. లిన్లిత్‌గో గారు మఱికొంత విశదముగా వ్యాఖ్యానము చేయగలిగినారు. రాష్ట్రములలోని ప్రతిపాలన విషయములో మంత్రులకే అధికారముండునని మాటప్రారంభించినారు. అందుకు [౧] గవర్నరు ఏపరిపాలనవిషయములలో తనకు ధర్మమనితోచునట్లు చేయుట కధికారముకలిగి రాష్ట్రములలోని శాసనసభలకుగాక బ్రిటిషుపార్లమెంటుకు బాధ్యుడైయుండునని చెప్పబడినదో, ఆప్రత్యేక పరిపాలనవిషయములలోకూడ మంత్రులతోటి ఏకాభిప్రాయమునకు వచ్చుటకు గవర్నరు సర్వవిధముల యత్నించుననియు మంత్రులు చెప్పునది తనకునచ్చినచో తప్పక అంగీకరించుననియు జెట్లెండు స్పష్టముగ చెప్పినట్లుగా చెప్పినారు.

(౨) [illegible] తుదకు గవర్నరుభేదించితీర యిష్టమువచ్చినట్లు నిర్ణయించవలసి వచ్చినపుడు విచారముతో అట్లు చేయవలసి వచ్చినదనుచు అజ్ఞనొసంగునవియు, అదిమాత్రముగాక ఈవిషయములలో మంత్రులకేలాటి బాధ్యతయుండజాలదనియు మంత్రులు అట్టి సందర్భములలో స్పష్టముగా ప్రజలకు తమకును గవర్నరుకునువచ్చిన అభిప్రాయభేదమును వెల్లడిచేసి, అమలు జరుపబడగల అజ్ఞకు తామెంతమాత్రము బాధ్యులుకామని స్పష్టముగచెప్పవచ్చుననియు లిన్లిత్‌గో గారు స్పష్టపరచుట కొద్దియో గొప్పయో మరియొకవిశేషము.

అయినను ఇట్టిసందర్భములు ఎంతో అసాధారణముగగాని తటస్థించవనియు, ఆప్రత్యేకాధికారములు చాలకొద్దియై నిర్ణీతమైనహద్దులు కలిగియున్నవనియు, అవికాకమిగిలిన విషయములలో గవర్నర్లు మంత్రులు చెప్పినదానిని వినితీరవలెననియు స్పష్టపరచి-ఏమోచాల గొప్పగా ఇచ్చినట్లు తోచజేసిరి.

కాని ఇవన్నియు వట్టిమాటలు గావచ్చును తెనానిజము గావచ్చును; అదంతయు ఆచరణలో తెలియవలెను-బ్రిటను దేశములో రాజుకు మంత్రులు చెప్పినదానిని ఇష్టము కానిచో త్రోసివేయుటకును, మంత్రులు నిరాకరించుదానిని ఆమోదించి అమలుచేయుటకునుకూడ అధికారములున్నవి-కాని ఆచరణలో అవిఉపయోగించబడుటలేదు. గవర్నర్లఅట్లుతమ ప్రత్యేకాధికారములను ఉపయోగించనిచో ప్రత్యేకాధికారములు శాసననిబద్ధములైయున్నసుభయము లేదు-అయినను బొత్తిగా ఉపయోగించరనుటకు వీలులేదనుటకుఆప్రత్యేకాధికారము లుపయోగించవలసివచ్చినపుడు ఏమేమి జరుగునో అంతదీర్ఘముగ చెప్పుటయేనిదర్శనము- ఉపయోగించుచో గవర్నరు సత్యముగా ఏవి అల్పసంఖ్యాకులహక్కులను భగ్నపరచునో, ఏవిరాష్ట్రశాంతికి మహోపద్రవమును దెచ్చునో,ఏవిప్రభుత్వోద్యోగముల కన్యాయకారియో-అట్టి సందర్భములందుమాత్రమే జోక్యముకలిగించుకొనగలడు. అట్టిసందర్భములను స్పష్టించుటకై కుట్రయత్నములు చేయుడు. గవర్నరు ఏవిధమునసైననేమి బ్రిటనుకులాభముకలిగించుచు, భారతీయ స్వాతంత్ర్యవికాసమునకు ఆటంకమేకలిగించుట ప్రధానాశయముగనుంచుకొనిన నిజముగా ప్రత్యేకాధికారముల నుపయోగించవలసిన పరిస్థితులు లేకున్నను, అట్టిపరిస్థితి సంభవించినదని సాకుచెప్పి మంత్రులను పలుమారులు అడ్డగించుటకు అవకాశములున్నవి; మఱియుఆట్టి సాధారణపరిస్థితిని కుట్రచేసిఉదయింపజేసి తనదుసంకల్పమును నెరవేర్చుకొనుటకును అవకాశమున్నది-ఉదాహరణార్థము, మంత్రులు పైఉద్యోగులజీతములను న్యాయముప్రకారము తగ్గించుటకు యత్నించెదరనుకొనుడు. ఉద్యోగులకు అతగ్గింపుఇష్టముకాదు కనుక గవర్నరుపద్ద మొరపెట్టుకొనవచ్చును-గవర్నరు ఉదారాశయుడై భావిక్షేమమును చూచుచో వెంటనేగాకున్నను కొద్దికాలక్రమమున తక్కువజీతములు అమలుకు సంపూర్ణముగా వచ్చుటకు అంగీకరించుటయేగాక తనజీతమునుగూడతగ్గించుకొనుటకు అంగీకరించును-అట్లుకానిచో ఉద్యోగులహక్కుయెడ అన్యాయముజరుగుచున్నదని సాకుజెప్పి మంత్రులనుశాసించినదివినకుండ తనప్రత్యేకాధికారముపయోగించవచ్చును-ఉద్యోగనియామకములలోకూడ కాంగ్రెసుమంత్రులు కుల మతభేదములనుపాటించుపద్ధతిని తీసివేయదలచినయెడల గవర్నరులదిఅల్పసంఖ్యాకులహక్కులయెడ అన్యాయమనిఅడ్డుతగులవచ్చును; గవర్నరు భారతజాతియొక్క నిజమైనక్షేమము మనస్సునగలవాడైనచో అట్లుఅడ్డుతగులకుండవచ్చును-ఇకపోలీసులకు చీటికిమాటికి జనులస్వాతంత్ర్యములను పీడించుటకు అవకాశమిచ్చు ఇప్పటి విశేషాధికారశాసనములు మున్నగునాటిని మంత్రులురద్దుచేయదలచినపుడు,గవర్నరుమంచివాడైనఒప్పుకొనవచ్చును-లేనిచో అదిప్రజాశాంతికిమహోపద్రవకరమని అడ్డుతగులవచ్చును-నిజముగా అవిశేషాధికారములను రద్దుచేయుట ప్రజాశాంతికి భంగకరముకాకపోవచ్చును, కాని తద్విపరీతముగా గవర్నరుతలచుటకు అధికారమున్నది-కనుక ఇంతకును గవర్నరుయొక్క మంచితనమునుబట్టి మంత్రులఅధికారములు విస్తరించును_గవర్నరులు కాంగ్రెసు నాయకులతో మంచిగానుందురని కాంగ్రెసువారికే నమ్మక

౧౧ వ పేజీ చూడుడు

Printed and Published by G, Ramakrishna Reddy at the Golkonda PowerPress Hyderabad. Editor K: Balakrishna Reddy